# కథాసంగ్రహం

హార్బరులో ఒక ప్రయాణీకుల షిప్ బయల్దేరడానికి సిద్ధంగా వుంది.

ఆ షిప్ కెప్టెన్ విజయరాం.

విజయరాం అసలు పేరైనా, అందరూ ఆయన్ని ఛాలెంజ్ రాముడు అంటారు.

ఏదైనా ఛాలెంజ్ చేశాడంటే, అందులో నెగ్గటంతప్ప, ఓటమి అన్నది ఎరుగడు.

ఆ ఓడలో, జడ్జిరాజశేఖరం, ఆయనకూతురు అందాల భరిణ అరుణ, 10 ఏళ్ళ కొడుకు మధు, మద్రాసుకు బయల్దేరారు.

విజయ్, అరుణలమధ్య పరిచయం, స్నేహంగా మారి, ఓడ మద్రాసుచేరుకునే సరికి ప్రణయంగా స్థిరపడింది. ఓడ దిగుతూ, కనీసం రోజుకు ఒక్కసారైనా తన ఇంటికొచ్చి కన్పించాలని విజయ్‌కు తను చెప్పలేక, తమ్ముడు మధుచేత చెప్పించింది అరుణ.

ఆదివారం — విజయ్, అరుణ, మధు, సముద్రపు ఒడ్డుకు పిక్నిక్‌కు వెళ్ళారు.

దాగుడుమూతలాట ఆడుతూ, సరదాగా పాడుకున్నారు.

ఆటముగిసింది — కాని మధుజాడ కన్పించలేదు. సముద్ర కెరటాలమధ్య తేల్తూ, మధు వాయించిన గిటార్ కన్పించింది. విజయ్, అరుణలు నిస్ప్రాణులయ్యారు.

మధు సముద్రానికి ఆహుతి అయిపోయాడన్న వార్త రాజశేఖరం గుండెమీద దెబ్బ తీసింది.

మర్నాడు ఉదయం, రాజశేఖరంగారి బంగళా వరండాలో ఓరోజా మొక్క కుండీ కన్పించింది. అది అక్కడికి ఎలా వచ్చింది, ఎవరు పెట్టారు ఎందుకు పెట్టారు అన్నవి, జవాబులేని ప్రశ్నలై వేధించాయి రాజశేఖరంగారిని.

విజయ్ వచ్చాడు. ఆ కుండీని శ్రద్ధగా పరీక్షించాడు. ఏదో కదిలిన శబ్దం అయింది. నేలకేసి విసిరికొట్టాడు. బ్రద్దలైంది. మొక్క వేరుకు ఓ ప్లాస్టిక్ సంచీ కట్టబడి వుంది. అందులో ఒక 16mm ఫిల్మ్‌రీలు కన్పించింది. తెరమీద ప్రొజెక్టు చేసి చూశారు అందులో మధు కన్పించాడు.

రాజశేఖరం తీర్పు ఇవ్వబోతున్న ఒక కేసు తాలూకు ముద్దాయి తండ్రి. మధుని అపహరించి ప్రతీకారం కోసం

దాచివుంచినట్లు ఒక అగంతకుని హెచ్చరిక ద్వారా తెలిసింది.

ఒక్క ఆ హెచ్చరిక తప్ప మరి ఏ ఆచూకీ బయట పడనంత పకడ్బందీగా ఆ ఫిల్మ్ తీసి పంపించారా ముఠావాళ్ళు. మధు బతికే వున్నాడన్న సంతోషం తప్ప, ఎక్కడున్నాడు? ఎలా విడిపించుకు రావడం అన్నది అసాధ్యమైన సమస్యలుగా మిగిలిపోయాయి అందరికీ.

కానీ, మధుని, ఎక్కడున్నా వెతికి, విడిపించుకొని తెచ్చి వొప్పగిస్తానని రాజశేఖరం గారికి మాటయిచ్చాడు విజయ్.

ఇదిలా వుండగా, తన తల్లి, తండ్రీ, అన్న, అక్కా, ప్రమాదానికి గురై చనిపోయారన్నది అబద్ధమనీ, జేమ్స్ అనబడే నరరూప రాక్షసుడి చేత ఒకేరోజున దారుణంగా చంపబడ్డారనీ, తనను పెంచి పెద్దచేసిన గోపాలం ద్వారా, కొన్నాళ్ళకు తెలుసుకున్నాడు విజయ్. ఆవేశంతో ఊగిపోయాడు. తన కుటుంబాన్ని నాశనం చేసిన ఆ దుర్మార్గుడ్ని, భూమ్యాకాశాలమధ్య ఎక్కడున్నా వెతికి పట్టుకొని, రగిలే తన పగని తీర్చుకుంటానని శపథం చేశాడు విజయ్.

విజయ్ మధు జాడ ఎలా తెలుసుకోగలిగాడు?

అతన్ని అపహరించి దాచివుంచిన దుర్మార్గులు ఎవరు?

తనవాళ్ళను దారుణంగా చంపిన హంతకుడు ఎవరు?

వాడి ఆచూకీ ఎలా తెలుసుకోగలిగాడు?

ఛాలెంజ్ రాముడిగా తనపేరు ఎలా సార్థకం చేసుకోగల్గాడు.

అన్న ఉత్కంఠను రేకెత్తించే సమస్యలకు పరిష్కారాలు రంగుల తెరపై చూడండి.



# పా ట లు

## పాట 1

రచన : ఆత్రేయ

పాడినవారు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం పి. సుశీల

పల్లవి ॥
అతను : ఆ ! ఎక్కడో ఎప్పుడో చూశాను నిన్ను
అందుకే నీ మీద వేశాను కన్ను
నీ వయసు పాలవెన్న
దానికి చూపిస్తా దారి తెన్నూ — దారి తెన్నూ.

ఆమె : ఇక్కడే ఇప్పుడే చూశాను నిన్ను
ఒక్కసారి కొట్టాలి అనుకున్నా కన్ను
ఎందుకనీ అడగమాకు
అలవాటై పోయింది నాకళ్ళకూ — నాకళ్ళకు

చరణం
అతను : అహా ! మూతి ముడిచి కూచుంటే చూడలేను
నువ్వు మూగనోము పట్టితే ఆగలేను
కళ్ళతో చెప్పేది నోటితో అంటే
ముత్యాలు రాలునా, ముద్దులే కరిగునా
ఆమె : నోటి మీద చెయ్యేస్తే ఒప్పుకోను
మళ్ళీ ఒంటరిగా ఉండ మంటే ఓపలేను
ఏయ్ ! అంటే అంటకుండ ఏమైనా చేసుకో
అంటించుకుంటె నువ్వు అంతుదొరకదు చూసుకో
॥ఎక్కడో॥

చరణం
అతను : పెదవి మీద నవ్వులింత ఎంత అందమో
నా పెదవి కదే హత్తుకుంటే ఎంత మధురమో
ఆమె : నవ్వులేని పెదవి నీకు నచ్చకుంటే
నన్ను మెచ్చుకునే మగాళ్ళు పిచ్చోళ్ళు తెలుసుకో
అతను : గిలిగింతలు పెట్టినా నవ్వనంటుంటావు
గిల్లి కజ్జాలు లాగితే కోపమొచ్చి తిట్టవా
ఆమె : బిగి కౌగిలింతలో గిలిగింతలుండునా
పట్టు దొరికి నప్పుడూ తిట్టయినా తీయనా.
॥ఎక్కడో

## పాట 2

రచన : ఆత్రేయ

పాడినవారు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం పి. సుశీల

అతను : చల్లగా లేపోంది మెల్లగా రమ్మంది
అడుగులో అడుగేసి, చేతిలో చెయ్యేసి
ఒక్కటై చక్కగా చెమ్మ చెక్కలాడగా

ఆమె : మెల్లగా లేపోంది. చల్లగా రమ్మంది
అడుగులో అడుగేసి చేతిలో చెయ్యేసి
చక్కగా చిక్కగా చెమ్మ చెక్కలాడగా

ఆమె : చల్లగాలి వీచినా ।
ఓపలేని కోరికేదో లోపలుండి ఉక్కబోసి
ఉడుకుతున్నది

అతను : ఎంత ఉక్కబోసినా । ఎంత వుడికిపోయినా
ఎంత ఒళ్లు తడిసినా ॥
అది అంతకంత చల్లబడును గాలి తగిలినా
మగగాలి తగిలినా

ఆమె : గాలిమళ్ళించనా గోలపుట్టించనా

అతను : ఆట పట్టించనా ఆశ రెట్టించనా

ఆమె : పడచు పగబట్టనా పరుగులెత్తించనా

అతను : కొంగు ముడివేయనా పొంగుచల్లార్చనా
॥చల్లగా॥

అతను : చెమ్మచెక్క లాడినా
చిలిపి తలపు లెన్నినీకు చెప్పలేక మిగిలిపోయి
నలుగుతున్నవి

ఆమె : ఇంత దూరమొచ్చినా ! అంతబెట్టు చెల్లునా
ముంతదాచ వచ్చునా
అది పైటగాలి తగలగానె బైట పడదనా
మోమాట పడదనా

అతను : ముసుగు తీసెయ్యనా । అసలు చెప్పెయ్యనా

ఆమె : అర్ధపాలిచ్చినా మొత్త మర్పించనా

అతను : నిన్ను మరిపించనా । నేను మురిపించనా

ఆమె : నిన్ను దాచెయ్యనా । నన్ను దోచివ్వనా॥ చల్లగా

## పాట 3

రచన : వేటూరి సుందరరామమూర్తి

పాడినవారు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం
పి. సుశీల

పల్లవి ॥

అతను : దొరదొర జాంపండురా
ఇది దొరికితేనె పండగా

ఆమె : తేర తేరగా దొరకదూ
తేనె చుక్కానీకు చిక్కేదూ
అది చిక్కేదూ ఇది దక్కేదూ
ఈ వెతుకులాట ఉద్దండగా.

చరణం

అతను : చూపులాపలేవు చుక్కమ్మో
కళ్ళకు కట్టిన గంతలా
చోటు. ఆ చాటు, ఆచోటు
దాచలేవు పిల్లమ్మో । ఎందుకలే కప్పగంతులా

ఆమె : దాగనట్టునే దాగాలా
ఎరగనట్టు నువ్వు రావాలా
గుట్టుచూసి పట్టుకోవాలా
అది పరువాల రసపట్టు కావాలా ॥

కుర్రాడు : గప్ చిప్.... ఉష్ షష్....

చరణం

ఆమె : కన్నెలేడి వేటగాడురో
వాడికన్ను పడితే యమగోలరో ;
సాటి, తనసాటి, సరిపోటి
తనకు లేరు లేరమ్మో । ఈ రాముడే భీముడు

అతను : చూడనట్టు నువ్వు చూడాలా
వేడికాని వేడి పుట్టాలా
అల్లరైతే ఆడుకోవాలా
అదే మల్లెపూల జాతరై పోవాలా

కుర్రాడు : ఉష్ షష్.... గప్ చుప్

## పాట 4

రచన : వేటూరి సుందరరామమూర్తి
పాడినవారు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

అతను : పట్టుకో పట్టుకో పట్టుకో పట్టుకో పట్టు చీర
పట్టుకో గుట్టుగా కట్టుకో చుట్టుకో నీలాలనీ మబ్బుచీర
సిగ్గులేదా ఎగ్గులేదా । చీరలేని చిన్నదాన
ఆమె : అహా ఎందుకూ ?
పట్టుకో పట్టుకో పట్టుకో పట్టుకో పట్టుచీర
చీరలా చుట్టుకో పైటలా కప్పుకో నీ చూపు నా మనసే చీర
సిగ్గులేలా చిన్నవాడ నీలోనే నేనులేన

చరణం :

ఆమె : పైటేస్తే జారిపోయె । నాలేస్తే చీరపోయె
చలిగాలో ముదిరిపోయె ఆశ నీతో ఒదిగిపోయె ॥

అతను : కన్నేస్తే కందిపోయె కాటేస్తే కరిగిపోయె
ప్రేమ సీమ పెరిగిపోయె । పెళ్ళినాటి ఆగదాయె
ఆమె : మందిరోళా చూడి నావెక్క అగ్గిపెట్టుకో
మల్లెపూలు తెల్లచీర సారె పెట్టుకో
అతను : అట్టాగే అంటుంటే ఇట్టాగే ఉంటుంది
ఏడాదో అప్పటికి గుర్తు పెట్టుకో ॥పట్టుకో॥
అతను : మెరుపులాంటి నిన్ను చూశా
ఉరుములున్న వన్నె చూశా
అహా । చిలిక చిలికి గాలివానై కమ్ముకొస్తే కలిసిపోతా
ఆమె : పిడుగులాంటి నిన్ను చూశా
గొడుగులాంటి నీడ చూశా
కలికి కవితి కన్నెవానై కప్పుకొస్తే పొంగిపోతా
అతను : మూడు ముళ్ళు పడ్డదాక ముద్దులాపుకో
తలుపు గడియ పడ్డదాక వలపులాపుకో
ఆమె : అట్టాగే అంటుంటే ఇట్టాగే ఉంటుంది
చిరిగిరి పోతాది గుర్తుపెట్టుకో ॥పట్టుకో

# పాట 5

రచన : పాడినవారు :

వేటూరి సుందరరామమూర్తి ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

కోప్పడతే కోమలాంగి
కోరుకున్నా సుందరాంగి
పొద్దున్నే కొట్టూ తిట్టు కుంటూ
పొద్దెక్కి తిట్టూ నవ్వుకుంటూ
మాపటేళ మల్లెలేళ ! ముద్దులిచ్చి పుచ్చుకోవె
బుల్లే నా బాబిల్లీ ! బుల్లే నా బాబిల్లీ.

చరణం

చీకటి పడితే చిలక పలికే
చిటత వయసూ నాలో వుంది
వెన్నెలొస్తే కన్నుకొట్టే
కన్నెమనసూ నీలో వుంది
వయసు తప్పుకి నన్ను తిట్టకు
వరద పొంగితే అడ్డుపెట్టకు
నువ్వు కొట్టితే బురిడీ , కుర్రసొగసులాకురిడీ
చెప్పు చెక్కులాడదాక ! చెంతకొస్తే గిల్లదాక
బంతే నా పూ బంతి !
॥కొప్పడతే

చరణం

పాలుమాపుకే వయసు పలికే
చిలిపి వలపూ నాలో వుంది
కోడెగాలికే కొంగుచెదిరే
కొత్త మెరుపూ నీలో వుంది
కౌగిలింతకే కసిరి కొట్టకు
పలకరింతకే పట్టుతప్పకూ
నీవు చేయకూ గారడీ ! నన్ను పెట్టకూ ఆరడి
మూడు ముళ్ళు పడ్డదాక మూడుముక్కలాడమాక
మల్లీ - నా సిరి మల్లీ.

॥కోప్పడతే

తాతినేని ప్రకాశరావు
సమర్పించు
అనిల్ ప్రొడక్షన్స్
తదుపరి చిత్రం

# రాణీ కాసుల రంగమ్మ

ఈస్ట్‌మన్ కలర్

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
టి.యల్.వి. ప్రసాద్ B.A.,

మాటలు:
కాసం గోపాలకృష్ణ

తారకరామ